శ్రీహయగ్రీవాయ నమః

# ద్విపద
# మేఘదూతము.



ఇయ్యది

గుంటూరు, టౌన్ హైస్కూలునందు సంస్కృతోపాధ్యాయులును

ఆంధ్రకాదంబర్యాది గ్రంథకర్తలు నగు

శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులచే

వ్రాయఁబడి

గర్తపురాగ్రహారవాస్తవ్యులును

మధ్వశాస్త్రసంపన్నులు నగు

తాటికోల శేషగిర్యాచార్యులవారికిఁ

కృతియొసంగఁబడి,

తద్ద్రవ్యసాహాయ్యమున

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1931

 [వెల 0-8-0

# ఠిక



కవికులగురుఁడగు శ్రీ కాళిదాస మహాకవి నెఱుంగనివారు లేరు ఇమ్మహామహుఁడు తన సరసకవితారచనలచే సహృదయహృదయంబుల నాకర్షించెను. ఈ సుకవిరచనాశూర్పములో నీరసశబ్దతుషంబులు నిలువవు. కావుననే, “పురా కవీనాం గణనాప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా

అద్యాపి తత్తుల్యకవేరభావా దనామికా సార్థవతీ బభూవ”

అని కవిగణనలో నగ్రగణ్యుఁ డాయెను. ఈ కవీంద్రుని కావ్యంబులన్నియు రసభూయిష్ఠంబులు తత్రాపి ‘మేఘదూత’ మీమహాకవి ప్రతిభాచాతుర్యమును, రచనాచమత్కారమును, లోకజ్ఞత్వమును, రసపరాకాష్ఠను వేనోళ్ళఁ జాటుచు ధ్వనిప్రధానమై గీర్వాణవాఙ్మయమున నొక వన్నె దెచ్చుచున్నది

రాజరాజానుచరుం డగు నొకయక్షుండు స్వాధికారప్రమత్తుఁడై యొకయేఁడు ప్రియురాలి నెడఁబాయుమని స్వామిచే శప్తుఁడై స్వమహిమలఁ గోల్పోయి రామగిర్యాశ్రమంబుల నివసించుచు నలకాపురిలో నున్న ప్రియురాలికి మేఘునిచే సందేశమంపుట యిందలి యితివృత్తము ఈకథనే ప్రతిపదశోకకంపముగా 122 శ్లోకములతో నీకవి పూర్తిగావించెను.

ఈ కావ్యరత్నంబునకు దాదాపిరువదివ్యాఖ్యానంబులును, అసంఖ్యాకంబులగు హంససందేశాద్యనుకరణంబులును గానవచ్చుటం జేసి యేతత్ప్రశస్తి మతింత ధ్రువపడుచున్నది. రసఖండ మగు నిక్కావ్యం బే నాంధ్రీకరించుటకు హేతువును కృతిప్రశంసలోఁ దెలిపియున్నాను భావపూర్ణంబులగు నిందలి శ్లోకంబుల ననువదింప వ్యాససమాసానుకూలంబులుగా నుండునని ద్విపదవృత్తముఁ జేకొంటిని మేఘదూత మంతయు మందాక్రాంతలోనే యుండుటచే ననువాదంబుగూడ నొకేవృత్తములో నుండుట సమంజసమని నాయాశయము. ఒక్కొక్క శ్లోకము నాల్గుద్విపదలలో నిముడునట్లే చాలవఱకు వ్రాసితిని కొన్నింటిని యథానుకూలంబుగ వ్రాసియున్నాను. అనువాదములోఁ జాలవఱకు మల్లినాథసూరివ్యాఖ్యనే యనుసరించినను, ఒక్కొకచో విద్యుల్లతనుగూడ ననుసరింపక పోలేదు. గుణాగుణంబులఁ బండితులే నిర్ణయింపఁ బ్రార్థితులు.

ఇట్లు విద్వద్విధేయుఁడు,

గ్రంథకర్త.

శ్రీ హయగ్రీవాయ నమః

# కృతి ప్రశంస



శ్రీ వెలయ నేమహాత్ముని
భావించెడివారి కఖిలభద్రములు కళా
ప్రావీణ్యము లొదవెడు నా
దేవు హయగ్రీవు నే మదిఁ బ్రార్థింతున్.

వ॥ అని యిష్టదేవతా ప్రార్థనంబు సలిపి యేతద్గ్రంథ ప్రకాశనంబునకుం గల సందర్భాదుల నొక్కింత వాక్రుత్తు.

సీ॥ మానూరువారిసంస్థానవర్తి నృసింహ
తజ్జ్ఞుఁ డెవ్వానిమాతాతతండ్రి
హనుమత్ప్రతిష్ఠ చేసినయణ్ణయార్యు లం
తర్వాణు లెవనిముత్తాతగారు
వేంకటేశాచార్యవిబుధుండు న్యాయస
భాధర్మవక్త యెవ్వానితాత
వేంకటరమణనామాంకుండు సుబ్బమాం
వరుఁడు దైవజ్ఞుఁ డెవ్వానితండ్రి
గీ॥ జ్యోతిషజ్ఞాత్రి శ్రీనివాసబుధపుత్రి
లక్ష్మినరసాంబ మెవనియిల్లా లతఁడు

తాటికోలాన్వయాంభోధిధవళకరుఁడు
శేషగిర్యభిధుండు కౌశికకులుండు.

మ॥ నను రప్పించి స్వగేహాసీమకు మహా
సందంబుతో నొక్కనాఁ
డనె ని "శ్లోయసఖా! భవద్విరచితం
జానామకళ్యాణముల్
గనుఁగొంటిన్, దిలకించితిన్ మఱియు మీ
కాదంబరీ కావ్యముల్ ;
మన ముప్పొంగ భవత్కవిత్వము సుధా
మాధుర్యధుర్యం బహో !

గీ॥ ఎన్నినాళ్లుగనో నాకు నెనఁగు సత్త
సంతతు లోనర్పవలెనని స్వాంతమందుఁ
గాని నేఁటికి హరిగురుకరుణవలనఁ
జాలవఱ కవి నెఱవేర్పఁ జాలినాఁడ.

సీ॥ నాగులవరముప్రాంతమున సహస్రంబు
చించావనంబు వేయించినాఁడ
గుంటూరులోన మాయింటిప్రక్కనె యాంజ
నేయు నాలయమందు నిలిపినాఁడ
పొరుగూరిమాధ్వ లేఁగురు నిత్యమును భుజిం
పఁగ నన్నసత్రి మేర్పఱిచినాఁడ

ఉత్తమకార్యోపయుక్తంబుగాఁ గొంత
ధనము నిక్షేపింపఁ దలఁచినాఁడ

గీ॥ మఱి తటాకప్రతిష్ఠకు మార్గ మొకటి
యారయుచునున్నవాఁడఁ జేకూరవచ్చు
జతపడఁగలే దదేమొకో కృతియె యెన్న
దినములో యయ్యె నేఁ బ్రియతించుచుంటి.

ఉ॥ క్షితి నారామతటాకముఖ్యము మహా
శ్రేయఃపదంబే, ప్రతి
ష్ఠిత మొం దందునెయుండి గాంచుఁ దగువా
సిన్, నించు సత్కీర్తులన్,
గృతి నవ్యైవపులఁ బ్రాఁకి కూర్చు స్థిరస
త్కీర్తిన్ గడున్; సప్తసం
తతిలోనన్ గృతిఁ బోలఁజాల వెదియున్
దత్తద్విశేషంబులన్.

క॥ కావున నొకకృతి సదర్స
భావాలంకారపటిమ భాసిలుదానిన్
గోవిదనుతిఁ గనుదానిన్
దావకసాహాయ్యమునఁ గాంచఁదలఁచితి ననఘా!

మ॥ దయచేయింపఁగఁజెల్లు నాకుఁ గృతినా
థత్వంబు వేవేగఁ గాం
చియమే తావకశక్తి! ధీనిధివి కా
శీకృష్ణవిద్వన్మణి
ప్రియశిష్యుండవు సంస్కృతాంధ్రకవితా
విజ్ఞాతవున్ నాగరా
జ్ఞయపారీణుఁడ వెంతయున్ దగుదుపో
నాకోర్కి యీడేర్పఁగన్॥

క॥ ఆలస్యంబున కోరువఁ
జాలన్ మీ రెదియొ వ్రాసి సమకూర్ప నగున్
గాలంబు, మీకృతుల నను
కూలం బగుదాని నొకటి కూర్పుఁడు నాకున్.

ఆ॥ వె॥ విందు మీరు మేఘసందేశకావ్యంబు
ద్విపదఁగూర్చినట్లు తెలుఁగులోన
దాని నిడుఁడు కాళిదాసీయకృతి కను
వాద మగుట మిగుల మోద మొసఁగు."

క॥ అని మృదుమధురోక్తులం
ననుఘన్ మాకెల్లఁ బెద్దయనియున్ బంధుం
డనియు నిది సుసంకల్పం
బనియున్ మదిలోన నెంచి యంటిని ఏదపన్.

ఉ॥ దక్షత యేమి చూచి కవి
తల్లజుఁడౌ మన కాళిదాసుఁ బ్రి
త్యక్షరలక్ష చే మును మ
హాత్ముఁడు భోజుఁడు సత్కరించెనో
యక్షరశూన్యుఁడై తెలుఁగ
నజ్ఞుఁడ; తత్కృత మేఘదూతమం
దక్షరకోటి యిచ్చినను
నమ్మహనీయుఋణంబు దీఱునే ?

క॥ రసఖండమైనదీనిన్
బొసఁగ సరసరీతి మార్పఁబోలునె విద్యా
పరిసరణశూన్యుఁడ నగు నా
కసలే నీరసములంట యనువాదంబుల్.

ఉ॥ ఒక్కొకచోట నొక్కొకటి
యొక్కొకవ్యాఖ్యను గానవచ్చెడిం
బెక్కుమొఱుంగు, లన్నియును
బీర్వడ నీ కనువాదమందునన్
గుఱిక్కఁగ నేరిశక్య; మిది
గో యదిలే దిది లే దటందు రీ
వెక్కిరిపించు నయ్యల వి
వేకము తామటు వ్రాసినపుగా !

సీ॥ 'ఎంత వారికినైనఁ గాంతానుషంగంబు
కడుముప్పునకె మూలకారణంబు
దానఁ బ్రమాదంబు తప్ప దెంతటిమహా
ఘనునకైన నిజాధికారమందు
అద్వాన యజమానునధికాగ్రహమునకు
గుఱియై మహత్త్వంబుఁ గోలుపోవు
దానిచే నధికసంతాపసంతప్తుఁడై
యష్టకష్టంబుల ననుభవించు
గీ॥ జనుఁ' డనెడునీతి నిందు యక్షకథవలన
నవిదితామరభాషులౌ యాంధ్రజనము
లెఱిఁగినన్ జాలు; బహుచర్చ లేల ? యదియ
యస్మదనువాదమునకు మహాఫలంబు ॥
గీ॥ అర్థదార్ఢ్యంబునకు బాల్యమందు వ్రాసి
నట్టియిక్కృతి మీకోర్కి నలరఁజేయఁ
గలిగనే నింతకున్ మేలుగలదె ? దీని
నిత్తు మీ కంకితం బని యియ్యకొంటి॥
క॥ ఆర్యునకు శేషగిర్యా
చార్యునకున్ సంస్కృతాంధ్రసమరసునకు స
త్కార్యునకుఁ ' దాటికొల ' కుల
ధుర్యున కంకితము చేయుదున్ మఱి దీనిన్॥

శ్రీహయగ్రీవాయ నమః

# ద్విపద

# మేఘదూతము

---

## ప్రథమాశ్వాసము

---

అనవధానుండై నిజాధికారమున
ధనపతికినుకకుఁ దానకం బగుచు
ఏఁడాది ప్రియురాలి నెడఁబాయు మనుచు
వాఁడియగు శాపంబు వడసి యద్దానఁ
దనదుసామర్థ్య మంతయుఁ గోలుపోయి
వనట యక్షుఁ డొకండు వాసంబుఁ జేసె
భూతనయాస్నానపుణ్యోదకముల
శీతలచ్ఛాయ నిచ్చెడు చెట్లగములఁ
గొమరారు తచ్చిత్రకూటాశ్రమములఁ
గమనీయవాసయోగ్యప్రదేశముల.

కాంతావియోగియగు కామి యక్షుండు
చింతచేఁ జిక్కి ముంజేతికంకణము
భ్రష్టమగుటయుఁగూడఁ బరికింపకుండ
అష్టమాసము లెట్లో యాయద్రిఁ గడపి
సుదినమగు నాషాఢశుక్లపక్షమున

మొదటివాసరమందు ముసువు దీపింప
వప్రకేళీకళావైభవమందు
క్షిప్రగతిం బొల్చుసింధురం బట్లు
దర్శనీయుం బౌచుఁ దనరు మేఘుంబు
దర్శించెఁ దద్భూధ్రతటభూమియందు.

కౌతుకసంధానకారణంబైన
యాతోయదంబున కభిముఖుం డగుచు
నిలిచి యెట్లో కంట నీరు వచ్చినను
వెలికిఁ గన్పడనీక విలపింపఁదొడఁగె
వారిదాగమ మెట్టివారల కేని
మాఱంగఁ జేయును మానసం బన్న
అరయఁ గంఠాశ్లేషణాతురాలైన
తరుణి దూరంబైనతఱిఁ జెప్పవలెనె ?

శ్రావణమాసంబు సన్నిధియగుడు
జీవితేశ్వరిని సజీవఁగాఁ జేయ
క్షేమంపువార్తను జీమూతువలనఁ
గోమలికిఁ బంపఁగోరి యాతండు
నెత్తావు లెల్లెడ నిచ్చలుఁ జల్లు
క్రొత్తగాఁ బూడమిన కొండమల్లియల
మోదంబుతో నర్ఘ్యమును గూర్చి ముందు
సాదరంబుగ నిట్లు స్వాగత మొసఁగె.

'జ్వలనంబు, వాయువు, జలము, ధూమంబుఁ
గలసి యేర్పడినమేఘం బది యేడ ?
బలవదింద్రియయుతులైన ప్రాణులు చేయఁ
గలిగిన సందేశకార్యంబు లేడ ?'
అని యిట్లు తలపోయ కాయక్షుఁ డడిగె
ఘను వినయంబుతోఁ, – గామార్తు లెపుడు
చేతనాచేతనాశేషంబులందు
భ్రాంతలిగా దీనులు సహజంబుగాను.

పుష్కరావర్తకంబులవంశమందు
నిష్కల్మషుండవు నీవు పుట్టితివి
కరుణాపరుండవు కామరూపుఁడవు
పురుహూతునకు ముఖ్యపురుషుండ వీవు
నీ విశేషం బెన్న నే నెంతవాఁడ
జీవించు నీకూర్మిచేత లోకములు
అందుచే నీకు నే నర్థి నైనాఁడ
మందయానను బాసి మసలుచున్నాఁడ,–
అధముని విషయకం బగు వేఁడికోలు
అధిగత ఫలమయ్యు నానంద మిడదు
అధికుని విషయకం బగు వేఁడికోలు
అధికతయే కూర్చు నప్రాప్తమయ్యు.

ధరఁ జెఁ బయోద ! సంతప్తుల కెల్ల
శరణంబ వీవకా చర్చించి చూడ

రాజరాజరుషావిరహితుండనైన
నాజాడఁ దెలిపి నానాతి రక్షింపు

శివశిరశ్చంద్రికాక్షీణానులేప
ధవళితహర్మ్యములై తళ్కొత్తుదాని
ధననాథులకు నెల్లఁ దానకం బగుచుఁ
దనరారు నలకాఖ్యఁ దరలంగవలయు.

కంటిపైఁ బడునలకల నెత్తిపట్టి
మింటఁబోయెడునిన్ను మించి చూచెదరు
తమజీవితేశ్వరుల్ తరలి యేతెంచు
సమయమంచును బాటసారిపూఁబోండ్లు
నీ వేగుదెంచినఁ నిశ్చలుం డగుచు
నేవాఁడు ప్రియురాలి నెడఁబాసియుండు?
దీనుఁ డిట్టిఁడు పరాధీనవర్తనుఁడు
కానంగరాఁ డెందుఁ గలికాని కైన.

మెలమెల్లఁగా నివే మేని కిష్టముగ
మలయుచున్నవి మందమందానిలములు
వామెత్తి యుల్లవే వానకోయిలలు
కూయుచున్నవి కలకూజితంబులను
బారుదీరిచి నభోభాగంబునందుఁ
జేరిమి రతికాంక్షఁ బెంటికొక్కెరలు
కనుల కింపుగ సొంపుగా నున్ననిన్ను
వెనువెంట నంటి సేవింపఁగాఁ గలవు.

గడియకు గడియకు గతవాసరముల
మడఁచి వ్రేళ్ళను బలుమార్లు లెక్కించి
ప్రాణంబు లెటో బిగఁ బట్టి నెమ్మనఁ
ద్రాణలేకయె నాదు దర్శనంబునకు
వాఁచి శాపాంతమా వాసరంబునకు
వేచియున్నట్టి యావిహ్వలగాత్రిఁ
బ్రవిమలచరిత నీభ్రాతృనర్ధాంగి
నవిహాతగమనుఁడవై చూడఁగలవు
ప్రణయి సద్యఃపాతి ప్రసవోపమంబు
గణుతింపఁగా సుమగంధుల మనము
జలదమా! తఱచు నాశాబంధనంబు
విలయంబుఁ గొననీదు విప్రయోగమున.

ఉర్విని గావించి యుచ్ఛిలీంధ్రనుగ
సర్వసస్యసమృద్ధిశాలిని సలుపు
వీనులవిందు నీవిరుత మాలించి
మానసకాసారమార్గంబుఁ బట్టి
డారిబత్తెమునకై తామరతూండ్లఁ
గోరినన్నింటిఁ జేకొని మింట నీకు
సాయమై కైలాసశైలంబుదనుక
రాయంచగములును రాఁగల విపుడు.

వాసి నేటేటను వానకాలమున
నీ సమావేశంబు నెగడుట కతనఁ

జరవియోగంబుచేఁ జెలఁగు బాష్పంబు
వరల నీసౌహృదవ్యక్తిని జాటు
ఘనుఁ డున్నతుండును గౌరవార్హుండు
కొనియాడఁ దగినమేల్గొనములవాఁడు
శ్రీరామపాదాబ్జచిహ్నితానేక
చారుసన్మేఖలాజాలంబువాఁడు
మిత్రుఁ డితఁడు ప్రేమమీఱఁ బూజించి
చిత్రకూటముకడ సెలవుఁ గైకొమ్ము.

సావధానంబుగా జలద! యాలింపు
తావకమార్గ మిత్తఱిఁ జెప్పువాఁడ
విందువు వీనులవిందు సేయంగ
సందేశ మామీఁద సంగ్రహించెదను
ఖిన్నుఁడవై దారి గిరికూటములను
మన్నన నివసించి మఱి సాగఁగలవు
క్షీణబలుండవై చిక్కి నిమ్నగలఁ
ద్రాణగల్గఁగ నీరు ద్రావి పోఁగలవు.

'హరియించుచున్నదా యద్రిశృంగంబు
సరభసంబున నేఁడు జంఝానిలంబు?'
అని తలల్ పైకెత్తి యతిసంభ్రమమునఁ
గన ముగ్ధలా సిద్ధకామినీమణులు
అలవోక దిఙ్నాగహస్తావలేప
విలసనంబుల దారి విదళించుకొనుచు

నిచ్చలు సరససన్నిచుళమై యొప్పు
నిచ్చోటనుండి నీ వెగురు మాకసము.

రతనాలకాంతులరాశియో యనఁగ
క్షితి దర్శనీయమై చెలువు దీపింప
నింద్రధనుఃఖండ మిదె పుట్టనుండి
సాంద్రరోచులతోడ జన్మించుచుండె
నెమిలిపించెముతోడ నెగడు శ్రీకృష్ణ
కమనీయమూర్తితోఁ గలుగుసామ్యంబు
నీలమై యొప్పారు నీదు నెమ్మేను
దాలుచు నీయింద్రధనువుచే నేఁడు

కృషిఫలంబెల్ల నీకృపఁగల్గునంచుఁ
దృషితలై నీపోవుదిశ నె గన్గొనుచు
భూరివికారంబుల పొలుపు లెట్టివియొ
భావింపరాని సౌభాగ్యదృష్టులను
జనపదంబులలోని జలజలోచనలు
అనురాగసహితలై యరయుచుండంగ
దున్నినతోడనే బోరలంగ గంధ
మున్నతభూముల నొగి నఘ్రించి
మఱికొంచె మటు పశ్చిమంబున కేగి
తిరిగియు నుత్తరదిక్కుకే చనుము.

జడివాన నొక్కటేజాడ వర్షించి
యడవిలోఁగార్చిచ్చు నడఁచిననిన్ను

నరయ మార్గాయాసు నామ్రకూటంబు
శిరసావహించుఁబో చెప్ప నేమిటికి
ఇక్కకై చెలిమికాఁ డే తెర నెట్టి
మ్రుక్కడియును బరాఙ్ముఖుఁడు గాఁడన్న
ఉన్నతుం డెల్లర కుపయోగభూతుఁ
డన్న గేంద్రుని వేఱ యడుగంగవలెనె ?

నీ వటు స్నిగ్ధవేణీసవర్ణుఁడవు
సేవించియుండఁ దచ్ఛృంగ మానగము
పరిణతఫలభార భాసురారణ్య
సరసరసాలసంఛాదితం బగుచు
నడుమ నల్లైప తెల్లనగఁ దక్కుచోట్లఁ
బుడమిచన్గుబ్బనాఁ బొలుపు చెన్నొని
సురమిధునంబుచేఁ జూడఁగాఁదగిన
సురుచిరలావణ్యశోభఁ గాంచెడిని.

వనచరకామినీవారోపభుక్త
ఘనకుంజపుంజంబు గలుగునక్కొండ
విశ్రమించి క్షణంబు వీడి భారంబు
నశ్రమంబున వేగ నచ్చోటు వాసి
మీఁదఁ బాషాణోన్నమితమైన వింధ్య
పాదంబునందునఁ బ్రవహించుదాని
శర్మదమై లోకసన్నుతిఁ గన్న
నర్మదానదిని గ్రిన్ననఁ గాంచఁగలవు.

వాంతవర్షుండవై వడిఁ దిక్తవన్య
దంతిమదావాసితం బైనదాని
నేరేడుపొదలచే నీరయం బగుచుఁ
బాఱెడు తన్నదీపానీయ మాని
అధిగతబలుఁడవై యటుమీఁద వాయు
పథము నధిష్ఠించి పయనమై పొమ్ము
ముదిర ! యంతస్సారమూర్తివౌ నిన్నుఁ
గదలింపలే దెట్టిగాఢానిలంబుఁ
బరిపూర్ణుఁ డెన్నఁడు భంగంబుఁ జెందఁ
డురలఁ బాఱుచునుండు నుత్తవాఁ డెపుడు.

హారితధూమ్రములౌచు నర్ధసంరూఢ
వరకేసరంబులు వరలు నీపంబుఁ
గనియు సంజాతాద్యకలికంబులైన
ఘనకందళుల మెక్కి కచ్ఛంబులందుఁ
గడు సురభిళమైన కానలలోని
పుడమిసౌగంధ్యపుంబొలుపు మూర్కొనుచు
సారంగములు నీవు చనినమార్గంపు
సూరెల నడుగకే సూచింపఁగలవు.

చాతురీ మింటనే జలముఁ జేకొనెడు
చాతకంబులను విస్మయమొప్పఁ గనుచు
నొక్కబారుగ మింట నున్నజక్కవల
నొక్కటి రెండంచు నొగి లెక్కయిడుచు

స్తనితంబులను నీవు సలుపునవ్వేళ
ననుకోకయే సిద్ధు లప్రార్థితముగ
సహచరీసోత్కంపసంభ్రమాలింగ
బహుమతుల్ వడసి సంభావింతురు నిన్ను.
నావార్త నెఱిఁగింప నానాతి కీవు
వేవేగ నలకకు వెడల నెంచినను
కొండమల్లియలతో ఘుమఘుమాయించు
కొండకొండను నీకుఁ గొంతసేపేని
జలద ! నీ వెంతటిజాగరివైనఁ
గలుగునంచుఁ దలంతుఁ గాలయాపనము
కేకలే స్వాగతోక్తిగ సబాష్పావ
లోకమౌ యాబర్హిలోకంబుచేతఁ
బ్రత్యుద్గతుండవై పైన నెట్లేని
నత్యంతజవముతో నరుగ యత్నింపు.
పువుఁదోఁటలం దగ్రఫుల్లకేతకుల
ధవళితవృతులౌచుఁ దనరారునవియు
నిలయవాయసనీడ నిర్మితివ్యాప్తిఁ
జెలఁగునూరులరచ్చచెట్లొప్పునవియు
విరియఁ గాచినపండ్లవిలసిల్లుజంబు
తరువనంబులచేతఁ దళ్కొత్తునవియు
రోయుచు నొకకొన్నిరోజులే యుండు
రాయంచగములచే రాజిల్లునవియు

నయి నీవు పోవ దశార్ణదేశములు
నయనంబులకు మహానందంబుఁ గూర్చు.

ఆదశార్ణంబుల కాభరణంబు
మేదిని విదిశ యన్ మేల్ప్రోలి కేగి
కాముకత్వమున కఖండమౌ ఫలము
శ్రీ మించ నచ్చోటఁ జెందఁగాఁగలవు
భ్రూవికారంబుతోఁ బోలుచు కెమ్మోవిఁ
ద్రావెడునటు తట స్తనిత మొప్పార
ఆత్రంబుతోడుత నాననౌ మధుర
వేత్రవతీనదీవిచలోర్మిజలము.

ఏఁడాది కొకసారి యేతెంచునట్టి
వాఁడ వౌనీసహవాసంబుకతన
విలసిల్లుక్రొవ్విరుల్ వెలయునీపములఁ
బులకరించినయట్లు పొలుపారుదానిఁ
బణ్యాంగనారతిపరిమళోద్గారి
గణ్యాతమానేకకందరంబులను
నాగరికులజవ్వనపు మిక్కుటములు
బాగుగా జనులకుఁ బ్రకటించుదాని
నీచైర్గిరీంద్రంబు నీ వధిష్ఠింపు
ప్రాచీనఖేదంబుఁ బాయ నచ్చోట.

వననదీతీరోపవనసముద్భూత
ఘనయూధికాజాలకంబుల నచట

సిడిసెందనీక క్రౌంజిన్కుట్టిబొలను
దడుపుచుఁ దద్ధరాధరముపై నీవు
విరులను గోయునవ్వీరిబోండ్లవదన
సరసిజాతములకు ఛాయ నిచ్చుచును
జెక్కుటద్దములపైఁ జెమటఁ బాపుటల
నొక్కింత వాడఁ గర్ణోత్పలశ్రేణి
నెడలుమా యటఁ గొంత విశ్రాంతిఁ జెంది
వడివడి నస్మదావాసవాటికకు.

పొలఁదికి నావార్త విన్నవింపంగ
నలక కేగెదునీకు నడ్డి చుట్టైనఁ
గాకు ముజ్జయినీప్రకామోరుసౌధ
లోకంబునకుఁ బ్రీతిలో ముండ వెపుడు
తటిదుల్లసనభీతతరళితాపాంగ
చటులపౌరాంగనాజనలోచనముల
సాదరంబుగఁ గేళి సలుపకయున్న
నీదుజన్మము మేఘ! నిష్ఫలం బగును.

చలదూర్మిమాలికాశబ్దాయమాన
కలహంసమాల చక్కనిమేఖలముగ
గతిఁదొట్రిలుచు నింపుగాఁ బొఱుదాని
నతదర్శితావర్తనాభి యాదాని
నిర్వింధ్య నటఁగూడి నెయ్యంబు నెఱపి
సర్వవిధంబుల సరసుండ వగుమ,-

విభ్రమంబే సుమా విభులచెంగటల
సుభ్రువులకుఁ బ్రేమసూచివాక్యంబు.
ప్రాణేశు నిన్నడఁబాయుటం జేసి
వేణీభూతసుసూక్ష్మవిమలాంబు వగుచు
తటతరుశాఖాపతజ్జీర్ణపర్ణ
పటలంబుచే మేనఁ బాండిమం బూని
సొగసుకాఁడా! నీదుసోయగం బెల్ల
జగతికి వేనోళ్ళఁ జాటుతత్తటిని
ఏయుపాయంబుచే నెడఁబాయుఁ గార్శ్య
మాయుపాయంబు నీ వరయంగవలయు.

చని యుదయనకథాచతురగ్రా వృద్ధ
జనులతోఁడి యవంతిజనపదంబులకుఁ
బున్నెంబు స్వల్పమైపోవ ధారుణికిఁ
జన్నక్రియాస్వర్గిజనములచేతఁ
బరిశిష్టసుచరిత్రఫలలబ్ధ మగుచుఁ
గరము వెల్గెడుస్వర్గఖండమా యనఁగ
శ్రీవిశాలం బౌచుఁ జెన్నారునట్టి
యావిశాలాపురి కరుగు మాపైన.
మదముచే నవ్యక్తమధురంబు [illegible]చుఁ
బొదలు బెగ్గురునుడుల్ పొదువుచేయుచును
లసదబ్జసంభవలాలితామోద
విసరముల్ ప్రొద్దున విస్తరించుచును

అంగానుకూలమై యంగనామణుల
కింగజాతశ్రమం బణఁచు నిచ్చోట
సప్రార్థనుం డైన స్వప్రియుం డట్లు
శిప్రాతరంగిణీ శీతవాతంబు.

విపణిమార్గములందు విలసిల్లునట్టి
యపరిమితాగ్ర్యనాయకరత్నములను
అమలంబు లైనముత్యాల పేరులను
సమతీతసంఖ్యలౌ శంఖశుక్తులను
ఘాసమంజులములౌ గరుడపచ్చలను
తోసంబు గూర్చువిద్రుమఖండములను
తిలకించి జలధులఁ దెలియుదు రచట
సలిలమాత్రావశేషములుగా జనులు.

'ఉదయనుఁడను నొక్కయుర్వీశుఁ డిందు
సుదతిఁ బ్రద్యోతనుసుతను హరించె,
అలఘుగుణుం డైనయారాజమణికిఁ
గల దిందె యొక్కబంగరుతాటితోఁట,
బలమునఁ గట్టుఁగంబముఁ బెల్లగించి
నలగిరి యిచటనే నాట్యమ్ము సలిపె'
అని యిట్లు వింతగా నాగంతుజనులఁ
దనుపుదు రచ్చోటఁ దత్కథావిదులు.

నవరైనయాకుపచ్చనిరంగు గలిగి
రవిహయస్పర్థులై రాజిల్లుహరులు

చదలంటి పర్వతసమములై కరులు
మదము వర్షించు నీమాడ్కి సంతతము
రావణు నెదిరించి రణరంగమందుఁ
జేవ నిల్చినజగజ్జెట్టులు గానఁ
జంద్రహాసవ్రణోత్సారితాభరణ
సాంద్రరోచులు యోధసత్తము లచట.

జాలనిర్యత్కేశసంస్కారధూప
జాలంబులను నుపచయ మంది మిగుల
బందుగుం డను పేర్మి భవనబర్హిణము
లందిచ్చునృత్యోపహారంబుఁ గొనుచు
సుమసమూహాత్యంతసురభిళంబులును
రమణీమణిపాదరాగాంచితములు
ధనిగృహంబులనుండి తత్పురలక్ష్మిఁ
గనుఁగొంచుఁ బాయు మార్గశ్రమం బచట.

తమతేనిగళకాంతి తనరువాఁ డంచుఁ
బ్రమథు లాదరముతోఁ బరికించుచుండఁ
జను జగద్గురువైన చండీశుకతన
ఘనతఁ గాంచినమహాకాళతీర్థంబు;
తీర్థమన్నను బుణ్యతీర్థమే కాదు
సార్థకం బది భోగసంపత్తిఁ గూడ
జలకేళిరతసతీజనబహుస్నాన
లలితపరీమళలంపటంబులును

గంధిలసరజస్కకైరవాయాత
గంధవతీనదీగాఢానిలములఁ
గంపితోద్యానంబుఁ గలిగి భోగులకు
నింపు సొంపును నింపు నెంతయు మదికి.

ఘనుఁడ! ముందుగ మహాకాళి మేగినను
ఇనుఁడు గ్రుంకెడుదాఁక నచటి కేగకుము
హరునిసాయంసమయార్చనమందుఁ
బరులు కీర్తింపఁగాఁ బటహత్వ మూని
గంభీరభవదీయగర్జితంబులకు
అంభోద! సాఫల్య మొదఁగాఁ గలవు.

గణిక లప్పుడు పదక్రమములచేతఁ
గ్వణితకాంచీదామకంబులు గలిగి
మణిరుచాఖచితచామరదండములను
గణనాథు వీచుచోఁ గరములు బడలి
నఖపదంబులఁ బతనంబుచే మివ్వుల
సుఖ మిచ్చుతొలివానచుక్కల నంది
కడుకూర్మి దీర్ఘభృంగశ్రేణులట్టి
కడగంటిచూపులఁ గాన్క లిచ్చెదరు.

నవజపాకుసుమంబునా నెఱ్ఱనైన
దివసాంతమందలిదీప్తిఁ జెన్నారి
మండలాకృతిఁ గప్పి మఱి యీశుబాహు
దండమహోద్దండతరుకాననంబు

భయము పోవుటఁజేసి పార్వతి స్తిమిత
నయనయై కన మహానందంబుతోడ
నటనాటి నేయాగ్రనాగాజినేచ్ఛ
నిటలాక్షునకుఁ బాపు నీ కగు శుభము.

కటికిచీఁకటిలోనఁ గాంతులఁ గవయ
నటఁ బోవుచుండెడునభిసారికలకు
నెటో దారి యనిభీతి యెనయ వెన్వెంటఁ
దటుకున మెఱసి యాదారిఁ జూపింపు
వరుసంబుఁ గురిపించి వణఁకింపఁబోకు
పరుసంబుగా నార్చి భయపెట్టఁబోకు
తాళఁజాలక వారు తలఁకి యేకీళ్ల
పా[illegible]దుగో నీకుఁ బాపంబు వచ్చు.

చిరకాలమును మెఱసినదాన నీదు
మెఱపుటిల్లాలికి మెయి నొచ్చునేమొ
ఉండుమా యారేయి నొగిఁ బాపురాలు
పండినయొకగృహోపరిభాగమందు
మరల సూర్యుఁడు దృష్టిమార్గానఁ బడుడు
నరుగుమా యటనుండి యధ్వశేషంబు
తల మిత్రకార్యముల్ దాల్చినయట్టి
యలఘులు దారిలో నాలసించెదరె ?
తఱి యదేకద నిజతరుణులపట్ల
మఱి తప్పొనర్చినమగవారి కెపుడు

మున్నాడి వారల మోములఁజూచి
కన్నీరు తొలఁగించి కలఁకఁ బాపంగ
ఆకారణంబుచే నరుగుమా వేగ
నాకమలాప్తున కడ్డ మయ్యెదవు
రేపాడివచ్చి కూరిమి హిమాశ్రువులఁ
బాపఁ బద్మినిముఖపద్మంబునుండి
కరములు చాఁచుచో ఘన! యడ్డదేనిఁ
జుఱచుఱ రవి నిన్నుఁ జూచుఁ గోపమున.

కలదు శైవాలిని గంభీర యనఁగ
జల మచ్ఛ మందు సజ్జనచిత్తమట్లు
ప్రాపించు నీ వెంతపాఱఁ జూచినను
నీపొందుఁ బ్రతిబింబనియతిచేనైన,
కనుక నాపై నీకుఁ గలగౌరవమునఁ
బను లాఁగునని నీవు పరుగిడ దేమొ
అన్నదీశఫరలోలావలోకములఁ
జిన్నవుచ్చెదుసుమీ చిక్కి నాతటిని.

తటకటీతటినుండి తలఁగిననీల
పటముచందంబునఁ బరఁగుతజ్జలము
కుసుమితవానీరకుటశాఖ సొమ్ము
లెసఁగుకైఁబోలె నొక్కించుకఁ దాల్చి
యదికూడఁ దొలఁగించి యానది పైన
ముదమున మదిలోన ముఱిసెదునీకు

వేగిరంబుగ నెంత వెడల నెంచినను
జాగె తప్పక యందు సంఘటిల్లెడును
అరుగుఁబో! జ్ఞాతరసాస్వాదుఁ డెవఁడు
జ్వరిగాక సతిశూన్యజఘనంబుఁ జూచి.

త్వద్వర్షణోచ్ఛ్వసితక్షితిగంధ
సద్ద్రవ్యభవంబుల సమకూర్చుకొనుచు
నాసికాపుటముల నాదంబు సెలఁగ
వాసనకై మదావళములు గ్రోల
ఫలియింపఁజేయుచుఁ బ్రాంతాటవులను
వెలయునుదుంబరోద్భవజాతములను
దేవగిరిఁ జేరఁ దివిరెడునీకుఁ
ద్రోవలో జలద! నీతోడ నేతెంచి
మెల్లఁగా వీచుచు మేని కిష్టముగఁ
జల్లతెమ్మెరలు నీశ్రమలఁ బాపెడిని.

అంద యేకాలంబు నావాసమున్న
స్కందునిపుష్పమేఘంబవై నీవు
ఆకాశగంగాజలార్ద్రమై యొప్పు
నాకుసుమాసార మతనిపైఁ గురిసి
అభిషేకమొనరింపు మతిభక్తితోడ
నభయంబొసంగఁగా నమరసేనలకు
మును మహేశ్వరువీర్యమున నామహాత్ముఁ
డనలముఖంబున నావిర్భవించె;

కాదు సామాన్యునిగతిఁ జూడ నతని
నాదిత్యుతలఁదన్ను నతఁడు తేజమున
శివశిరశ్చంద్రికాశ్లేషంబుచేత
ధవళితాపాంగమౌ తన్మయూరంబు
గిరిప్రతిధ్వానదీర్ఘితముతో నీదు
నుఱుముల నాడింపు ముత్సాహమొదవ,

తనరుచు జ్యోతిర్వితానంబుపగిదిఁ
దనకుఁ దా రాలిన దానిపించియము
నిలుపుఁ గుమారుపై నెనరున గౌరి
కలువఱేకులపుంచు కర్ణంబులందు-
ఈరీతి శరజన్ము నెచ్చినభక్తి
నారాధనముచేసి యాపైనఁ జనుము.

పడినచోఁ దంత్రులపై నీటిబొట్లు
చెడు వీణె లనుభీతి సిద్ధదంపతులు
దూరంబుగా నీదుత్రోవఁ ద్యజించి
భూరివేగమున నభోవీధి నేగ
గోమేధములు మఱి కోటానుకోట్లు
భూమిపైఁ గావించి పొగడితఁగన్న
రంతిదేవుం డనురాజేంద్రకీర్తి
కాంతయే యీరూపుఁ గైకొన్న దనఁగఁ
దనరు చర్మణ్వతిఁ దనియించి నీదు
జననసాఫల్యంబు జలద ! కావింపు.

అలశార్ఙ్గిమైచాయ నలరునీ వందు
జలమాన దిగుడు నోజలద! యావేళ
నతిదూర మగుటచే నల్పంబుభాతిఁ
దత మయ్యుఁ గనిపించుఁ దత్ప్రవాహంబు
గగనచారులు యక్షగంధర్వముఖులు
దిగిచి దృష్టులఁ జేర్చిఁ దిలకింపఁగలరు
మహీ ధరించినస్థూలమహితేంద్రనీల
సహితమా ముత్యాలసరముచందమున.

శైవాలినిఁ దానిఁ జయ్యన దాఁటి
భూరివిలాసంబులపొలుపు లెఱింగి
ఆతెప్ప లెత్తుట నంతటఁ గృష్ణ
సారవిద్యుతు లాకసంబునఁ బర్వ
మఱి పైకిఁ జిమ్మినమల్లెలవెంటఁ
దరలు తేఁటులఁబోని దశపురసతుల
నేత్రోత్సవములకు నీశరీరంబుఁ
బాత్రంబు చేయుచుఁ బయనమై పొమ్ము.

అనఘ! బ్రహ్మావర్త మనుజనపదముఁ
జనుదారి నెమ్మనిచాయతోఁ జొచ్చి
సేవింపుమా కురుక్షేత్ర మిప్పటికి
భూవరసంగరాభోగసూచకము
నీరజంబుల నీవు నిర్భరాసార
ధారలఁ జెల్లాచెదరు చేసినట్లు

గాండీవి వైరిభూకాంతులతలఁ
జెండాడె నిచ్చోట శితసాయకముల.

అల రేవతీలోచనాంకితమైన
హాల నభిమతరసనైన వర్జించి
దురమును మాని బంధుప్రీతి సీర
ధరుఁ డేజలంబులఁ ద్రావెఁ దాఁ దొల్లి
ఆసరస్వత్యాపగాంబువు లాని
భాసురసౌఖ్యంబుఁ బడసె దోసౌమ్య!
అంతర్విశుద్ధుండ వగుదువు నీవు
చింత యేటికి రంగుచే నల్లనైన.

అటనుండి ఖనకల మంటి శైలేంద్ర
తటినుండి ప్రవహించుదాని జాహ్నవిని
సగరాత్మసంభవ స్వర్గసోపాన
మగుదాని సేవింపుమా యామె యనఁగఁ
బార్వతీదేవిభ్రూభంగబంధనము
నుర్వునవ్వుల నవ్వునో యన్నమాడ్కి
బాలేందులగ్నోర్మిపాళియై యెపుడు
ఫాలలోచనుకేశపాశంబు లాగు.

వినువీథి సురకరివిధముగా నీవు
వెనుకభాగంబుచే వ్రేలాడుకొనుచు
అమలినస్ఫటికోపలాచ్ఛవహా తజ్జ
లముల నడ్డముగఁ గొల్లగఁ గ్రోలునపుడు

నీనీడ శైవలినీప్రవాహమునఁ
గానంగఁబడుటచే గంగామతల్లి
రమణీయ యగుచు నేర్పడు నస్థలమున
యమునాస్రవంతితో యముఁ గూడె ననఁగ
సురభితశిలము కస్తూరీమృగోత్థ
వరనాభిగంధసువాసనావళుల,

పరిభవంబు పొరిగుక్తపావనాపగకు
నభితస్సితంబు నీహారవారముల
ఆగిరీంద్రముఁ జేరి యం దొక్కశిఖర
భాగ మీ వాక్రమింపఁగ శ్రీమంతాల,
త్ర్యంబకవృషసముత్ఖాతపంకోప
మం బైన డం బభ్రమా! దాల్పఁగలవు.

మఱి యాధరేంద్రంబు మారుతోద్ధూత
సరళసంఘట్టనజనితదావాగ్ని
వరచమరీవాలవారభారముల
సురసుర నంటుచు సుఱ్ఱుక్కింపఁ జేయ
నీరదంబా! దాని నిర్మూలముగను
వారిధారాపరంపరలఁ జల్లార్చు
ఆపన్నజనములయార్తి సతంబుఁ
బాపనేగాదె సంపద లుత్తములకు.

కరి యనుభ్రాంతి నిన్ గని నీదుపైకి
సరభసవృత్తిమై శరభంబు లెగుర,

చంగునఁ దత్ప్రదేశము దాఁటి స్వాంగ
భంగంబు వానికిఁ బాటిల్లఁజేసి
పడి క్రింద వేదనఁబడువానిపైన
వడగండ్లవాన నవ్వారిగాఁ గురియు
పరికింప నిష్ఫలప్రారంభు లేరు
పరిభవంబుల కిల్లు పాత్రముల్ కారు?

రాతిపై నాశైలరాజమం దొకట
శీతాంశుధరుపాదచిహ్నంబు వెలిసె
సిద్ధిఁగాంచినమహాసిద్ధులు దాని
శ్రద్ధమై నిత్య మర్చన సల్పుచుండ్రు
ఆపాదవిన్యాస మరసినయంతఁ
బాపంబు లెటొ పటాపంచలైపోవ
దేహాంతమందు సుస్థిరగణపదవి
నాహా! వసించెద రాస్తికజనులు
దారియే గాన సద్భక్తి నీ వటకుఁ
జేరి చేయుము ప్రదక్షిణనమస్కృతులు.

మారుతంబులఁ బూర్యమాణమై సారె
సారెకుఁ గీచకచయము ధ్వనింప,
కలసి తా మొక్కటిగాఁ గిన్నరాంగ
నలు, పురజయము గానముచేయుచుండ
మురజంబువలె నీయమోఘనిర్హ్రాద
భరము కందరములఁ బ్రతిశబ్దమీన

అటను సంగీతార్థ మగు సమగ్రంబు
నటరాజశేఖరునకు నీకతమున.
ఉపతటినాగిరి నొప్పుచిత్రముల
నపరిమితంబుల నరయు చామీఁద,
క్రౌంచరంధ్రంబు భార్గవరామకీర్త్య
దంచంబు, మానసద్వార మంచలకు,
కనుగొని యడ్డంబుగా దాన నీవు
చనువేళ బలిని రసాతలంబునకు
నడఁగఁద్రొక్కఁగఁ బెంచునయ్యంబుజాక్షు
నడుగునా శ్యామత నగుపింతు వీవు.

అటు కొంత యేగి దశాననుబాహు
పటలోచ్ఛ్వసత్సంధిబంధంబు లొప్పి
అల దివిజస్త్రీల కద్దంబుమాడ్కి
నలరు కైలాసాద్రి కతిథివి కమ్ము
కుముదశుభ్రంబులై కొమరారు శృంగ
సముదయంబుల నాకసముఁగప్పి యొకట
గుట్టగా నిత్యంబుఁ గూర్చినహరుని
యట్టహాసంబునా నాయద్రి తనరు.

అటు స్నిగ్ధభిన్నాంజనాభుండ వీవు
తటగతుం డగుడు సద్యఃకృత్తదంతి
దంతవిచ్ఛేదాతిధవళ మత్యంత
కాంతియుతంబౌచుఁ గైలాసశిఖరి

నీలాంబరపునిగన్నిగలు మైనెగడు
తాలాంకధరుపోల్కిఁ దాల్చునం చెంతు.

అహికంకణము వీడి యాయాటకొండఁ
దుహినాంశుధరుఁడు చేదోడుగా నుండ,
పాదచారిణిగనే పర్వతపుత్త్రి
వేదనపడుచుఁ దా విహరించెనేని
అంగంబు గడ్డగా నప్పుడే భంగ
భంగంబులుగ మెట్లుపగిదిఁ గావించి
మణితటారోహణమార్గంబునందు
నణుమధ్య కీవు సహాయమ్ము కమ్ము.

కంకణకోటిసంఘట్టనోద్దీర్ణ
కంకణజాలు నిర్ఘర్మసంలబ్ధ
ధారాగృహంబుగా దైవతాంగనలు
ఘూరిచి యాం దెంతకును వీడకున్న,
కర్ణకఠోరభీకరగర్జితములఁ
బూర్ణేందువదన లాపూఁబోఁడు లాట
సందడిలో నున్నసమయాన భయముఁ
జెందునట్లుగఁ జేసి శీఘ్రింబ పొమ్ము.

అనుచు జాంబూనదాంబుజోద్భావి
మానసకాసారమహనీయజలము
నలుపుచు ముఖపటసంప్రీతి నభ్రి
తలచరదైరావతమునకు క్షణము

చలియింపఁజేయుచుఁ జల్లతెమ్మెరల
లలితకల్పద్రుపల్లవదుకూలముల
మనసునకుఁ నచ్చువాడ్కి నోజలద
అనుభవింపుమ యమ్మహామహీధరము.

అందుఁ బ్రియోత్సంగమందుఁబూఁబోఁడి
చందానఁ దదచలోత్సంగంబునందు
లలితగంగాదుకూలముఁ బాయుదాని
నలకఁగా గుర్తింపుమా కామచారి!
జలదాగమమున నుచ్చవిమాన యద్రి
జలకణవర్షభ్రజాలంబుఁదాల్చి
ముత్తెసరులతోఁడి ముంగురుల్ గ్రాలు
చిత్తరువలెఁ గడుఁబ్రియముఁ గావించు.

—♦ గద్యము ♦—

ఇది శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యప్రణీతంబగు
ద్విపద మేఘదూతంబునఁ
బ్రథమాశ్వాసము.



శ్రీహయగ్రీవాయ నమః

# ద్విపద

# మేఘదూతము

—:o:—

## ద్వితీయాశ్వాసము

—:o:—

అలకాపురిన్ బోలు పౌరసౌధములు
జలద! తత్తద్విశేషముల నిన్ బోలు
మెఱపుఁదీఁగెలతోడ మెఱసెద వీవు
మెఱుఁగుఁబోఁడులతోడ మెఱసెడు నవ్వి
దివిజేంద్రధనువుతో దీపింతు వీవు
వివిధచిత్రములతో విలసిల్లు నవ్వి
శ్రావ్యగంభీరఘోషల నొప్పు దీవు
శ్రావ్యమృదంగఘోషల నొప్పు నవ్వి
వారిగర్భుండవై వరలెద వీవు
చారుమణిస్థలాస్ఫారంబు లవ్వి
అంబరంబును గప్పి యలరుదు వీవు
అంబరపరిచుంబదగ్రంబు లవ్వి.

కరములందు విలాసకమలరాజములు
కురుల లేమొల్లలఁ గూర్చినసరులు
ముద్దులొల్కెడునిండుమోములయందు
లొద్దుగుఁబువ్వులలోనిపుప్పొడులు
గోరంటపూవులు క్రొమ్ముడులందుఁ

జాజుశిరీషముల్ శ్రవణంబులందు,
పాపటలందు నీప్రాపు సూచించు
నీపంబులందు మానినులు దాల్చెదరు.
అందు వృక్షములు నిత్యప్రసూనములు
తుందిలేందిందిరస్తూయమానములు
కొలఁకులు నిత్యసంకులపంకజములు
కలహంసికామాలికావేష్టితములు
భవనబర్హులు నిత్యభాస్వత్కలాప
నివహముల్, రవసమున్నతకంఠములు
సంజప్రొద్దులు నిత్యచంద్రికాపుంజ
మంజులంబులు తమోమదభంజనములు.
ఎన్నఁడు నెఱుఁగ రయ్యెడ నున్నవారు
కన్నీరు ముదమునఁ గాక వేఁకటఁ
గానరు ప్రియురాండ్రగట్టికౌఁగిళ్ల
మానుతాపముకన్న మఱి తాప మెఱుఁగు
ఆరయ రలపొలయల్కచేఁగాక
వేఱుగా మఱి దేవ విప్రయోగంబు
నెఱుఁగరు, సుఖముల కెక్కుడై పరఁగు
నెఱజవ్వనంబుకంటెను బ్రాయ మెఱుఁగు.
భాసురైందవశిలాబద్ధంబు లగుచు
భాసిల్లుహర్మ్యాగ్రభాగమ్ములందు
వేల నిత్యముఁ బ్రసరించి తారకలు
పూలు చల్లినయట్టిపోలుపునఁ బోలుచు

అందుత్తమోత్తమలై పేరుగన్న
సుందరీమణులతో సుఖములఁ దేల
నిదుగంభీరధ్వనిఁ బురుడించు
వాదిత్రములు వినవచ్చుడు వారు
రతిఫల మనుమద్యరాజంబుఁ గల్ప
క్షితిరుహాజాతంబు సేవింతు రచట.

అమరులచేనైత మర్థింపఁబడిన
కొమరుఁబ్రాయంపు జక్కులకన్నెగములు
మందాకినీమందమందానిలములు
జెందంబులకు నూఱడింపు ఘటింప ;
తీరమందారధాత్రీరుహావార
వారితరవికరవ్రాతలై యచట
గూఢంబు గావించి కొండొక్కమణిని
గూఢమణిక్రీడఁ గూడి యాడెదరు.

తనకుఁ దానై జాఱి తలఁగెడునీవిఁ
గనుఁగొని ప్రియులతోఁ గలయంగ నదియె
సమయం బటంచుఁ జంచలకరాబ్జముల
రమణులు కూర్మిఁ జీరలు చీరుచుండ
సిగ్గుచే నేమియుఁ జేయంగలేక
దగ్గఱ నున్నయుత్తమచూర్ణములను,
తళతళ వెల్గురత్నప్రదీపముల
జళికించియును వ్యర్థచర్య లయ్యెదరు

ఇటువంటి చిత్రంబు లెన్నియో నీకు
నటఁ జూడనగు నయనానంద మెసఁగ.

తంతువిలంబివైతానికచంద్ర
కాంతమణుల్ శశికరములఁ గరఁగి
బొటబొటమని నీటిబొట్టులఁ గురిసి
చటుకున సురతసంజనితార్తి మాన్పు
సగరేలఁ బ్రియభుజోచ్ఛ్వాసితాశ్లేష
లగుకామినులమేల్మియంగంబులందు.

ప్రేరకుఁ డైనసమీరకువలనఁ
జేరి విమానాగ్రసీమల నందు
స్వేదాంబుకణములఁ జిత్తరువులను
బాయనిదోషంబుఁ బాటిల్లఁజేసి
శంకచేఁ బోలె జర్జరితంబు లగుచు
జంకుచుఁ గొంకుచు జాలమార్గముల
మాఱురూపముల ధూమంబులవేరఁ
బాఱుచు నుండు నీవంటిమేఘములు.

తఱుఁగనినిధులు సద్మంబుల వెలయ
మెఱుఁగుటచ్చరలు సమీపమం దలర,
పయి స్థాయిలో ధనపతిసద్యశంబు
నయమొప్పఁ బాడుకిన్నరకోటితోడ,
చిత్రరథమునాఁ బ్రసిద్ధమై యధిక
చిత్రంబులకు జన్మసీమయై యొప్పు

పూవులతోఁట నేపార్ధఁ గాముకులు
భావింపరానివైభవముల నుండ్రు.

అడుగులతొట్రుచే నలకల జాఱి
పడినమందారపుష్పంబులచేత,
గండభాగచ్యుతిఁ గన్నకపోల
మండనాపళ్ళు లైనమకరులచేత,
శ్రవణయుగ్మమునుండి జాఱుటం జేసి
భువిఁ బొల్చుపొందమ్మిపూవులచేత,
బరువైనగబ్బిగుబ్బలతాఁకుబడులఁ
తెరిఁగినముత్యాలపేరులచేత
విభులను గవిసెడువేడుక రేల
నభిసారికాంగన లరిగినత్రోవ
తెల్లంబుగాఁ దెలతెల్లవాఱగనె
యెల్లజనంబుల కెఱుఁగనౌ నచట.

ధనపతి సఖుఁడౌటఁ దాఁ ద్రినేత్రుండు
అనయ మందు వసించు నని మన్మథుండు
జంకుచే షట్పదజ్యం బైనధనువుఁ
గొంకును దఱుచుఁ జేకొనుటకుఁగూడ
ఐనను గామిలకార్యమోఘములు న
హీనభ్రూభంగప్రహితలోచనములు
చతురకాంతావిలాసవిశేషతతులు
సతతంబు తత్కార్యసంసిద్ధిఁ గూర్చు

చిత్రచిత్రంబులౌ జిలుఁగుచీరెలును
నేత్రవిలాసముల్ నేర్పుమద్యములు
వివిధపల్లవములు వివిధపుష్పములు
వివిధభూషణములు వింతవస్తువులు
చరణరాజీవరంజనమంజులోప
కరణంబులౌ యలక్తకరసంబులును
తలఁచినంతనె యిచ్చుఁ దత్కల్పకంబె
వెలఁదుల కటఁ జతుర్విధభూషణములు.

ధనపతిమందిరోత్తరభాగమందు
ననతిదూరముననే యలరు మద్గృహము
సురపతిధనువునా సుందరం బగుచు
వరతోరణము గానవచ్చు దవ్వుననె
చేతి కందెడుపూలచెండ్లచే వంగి
నాతన్వి పుత్త్రిమన్ననఁ బెంపఁ బెరిఁగి
దీపించు నీకు గుర్తింప నద్దాని
దాపున బాలమందారవృక్షంబు.

మసృణవైడూర్యసమంచితనాళ
విసృమరహేమాబ్జవికసితంబగుచు
వాపి యొక్కటి యందు వరలు మారకత
సోపానపంక్తులఁ జూడనై యొప్పి
అందు వసించురాయంచలు నిన్ను
ముందు వీక్షించియు మోసాలనున్న

మానసంబున కేగి మనవచ్చు నంచు
మానసంబున నేని మఱి యెంచ వెపుడు.
రుచిరేంద్రనీలోరురోచిరంఛోళి
విచికిలశిఖరమై వింతఁగొల్పుచును
గనకరంభావనాకాంతమై జలద!
తనరుఁ గ్రీడాపర్వతంబు తత్తటిని
మిత్రమా! నాదుభామిని కది ప్రేమ
పాత్రమాటఁ "బదేపదే" చెప్పనేల
నినుఁ దటిత్సందర్శనీయుఁ జూచుడును
మనసున కది మఱిమఱి జ్ఞప్తివచ్చు.
జలద! యాకృత్రిమశైలంబునందు
విలసిల్లు నొకమాధవీమండపంబు
దాని చెంగటఁ జలద్దళ మశోకంబు
మానైనపొగడయు మఱి కానిపించు,
ఆరెండు నెపుడు దోహదకైతవమునఁ
గోరెడు ననుఁబోలెఁ గోమలికూర్మి
నొకటి తద్వామపాదోరుతాడనము
నొకటి తన్ముఖమదిరోపాసనంబు.
రవ్వలపీఁటతో రాజిల్లుపైఁడి
మవ్వంపుగడ వానిమధ్యఁ జెన్నారు
పచ్చివెదుళ్ళంతోఁ బల్లటీలాడు
పచ్చరాయరుఁగు కన్పడు దానిక్రింద
ఘలుఘల్లుమని పైఁడిగాజులు మ్రోఁగ

లలిఁ దాళనులను మలలన యూడింప
ముదమొందు సౌమిత్రిముఖ్యు మా నెమిలి
నిదురించు రజనుల నిత్య మూఁగడను.
గుఱుతు వేఱొక్కటిగూడఁ జెప్పెదను
మఱి నీని మదిలోన మఱవకు మయ్య
కలవు వాకిట నిరుగడలఁ గుడ్యముల
సలలితంబుగ వ్రాసి శంఖపద్మములు
నాయెడఁ బాసిననాఁటనుండియును
నేయుత్సవము లేక యెసఁగుటకతనఁ
దేజంబు చెడి యిల్లు దీపింపకుండు,
రాజిల్లునే తమ్మి రవి నెడఁ బాసి?
కలభరూపంబును గమన వేగంబు
గలుగుటకై ఘూని కమనీయసాను
మండితం బధికరమ్యము నైనయాట
కొండపైఁ గూర్చుండి కొండొకసేపు
ఖద్యోతపటలీప్రకాశనిభంబు
విద్యుదాలోకంబు విడు మాతిపురిని.
చూడఁగాఁగల వొక్కసుందరి నందు
లేడిమూపులను గెల్చెడుచూపుదాని
సన్నని నెమ్మేనిసౌరులదాని
మున్ననఁ గన్నచామనచాయదాని,
పరిపక్వదాడిమీఫలబీజములకు
సరి మానికములపల్వా లొప్పుదాని

దోరగాఁ బండినదొండపండులకు
వారగా నగరానివాతెఱదాని
నడుమునఁ బేదతనం బొప్పుదాని
నడిజవ్వనముదాని నతనాభిదాని
ఘనజఘనత మందగమనంబుదాని
స్తనగౌరవమున సుంతగ వంగుదాని
స్రష్ట నిర్మించినసౌందర్యవతుల
సృష్టిలోపలఁ దొలిసృష్టియౌదాని.

అదియె నాసర్వస్వ మదియె నాహృదయ
మదియె నా రెండవయాత్మ వేయేల ?
చక్రవాకియుఁబోలె సహచరు నన్ను
వక్రదైవమ్ము పాపఁగఁ గుందు నామె
శిశిరనిర్మథితయై చెడి తొంటిరూపు
కృశిమ వహించినకమలినిం బోలె
ఈదివసముల నాయింతి వియోగ
వేదనచే మాఱి వేఱుగా నున్న
నంతమాత్రమున నీ వాతన్వి నన్య
కాంతగా మది సుముఖా ! యెంతువేమొ.

ఎడతెగ కెల్లప్పు డేడ్చుటం జేసి
కడు నుబ్బుగాంచినకన్నులతోడ
వేఁడినిట్టూర్పులు విరివిగా నుంట
వాఁడి వన్నెతఱుఁగువాతెఱతోడ
ముసురుచు వ్రేలాడుముంగురు లొప్పి

యసకలవ్యక్తియగు యామెమోమునకు
నీనిరోధంబుచే నిష్ప్రభుఁడైన
యూనలినారిదైన్యంబు నూహింతు.
జలద ! నీదృష్టిగోచర మగు నామె
కులదేవతార్చనాకుల యగుచుఁగాని
తలఁపులో నున్న నాతనువును జిత్ర
ఫలకమ్మునందున వ్రాయుచుఁగాని
ప్రియముతో ని న్నెంతో పెంచిననీదు
దయితు నెన్నఁడుగాని తలఁతువా యంచు
మంజుభాషణముల మది నలరించు
పంజరశారికఁ బలుకుచుఁగాని.
మలినవస్త్రోత్సంగమండలమందు
విలసితం బగునొక్కవీణియ నుంచి
నాదునామాంకంబునఁ బొల్చుగేయ
మేదేనిఁ బాడఁగా నెంచి బిగ్గఱగఁ
దడియుఁ గన్నీటిచేఁ దంత్రులు వానిఁ
తుడిచి "పదేపదే" దొరలునాస్మృతిని
వాటిల్లుమూర్ఛఁ బూర్వపుమూర్ఛనలను
మాటికిమాటికి మఱచుచుఁగాని.
ఎడఁబాయు టాదిగా నేఁడాదివఱకుఁ
గడచిననెలలు పోఁగాఁ దక్కునెలల
లెక్కించుచునో, దేహళీపుష్పములను
'ఒక్కటి రెం' డంచు నుర్విపై నుంచి

మనసునందున మత్సమాగమసుఖము
ననుభవించుచునో, నీ కగుపించు నామె;
ఇవియెగా పతులతో నెడఁబాసినపుడు
పువ్వుఁబోఁడులకుఁ బ్రొద్దుఁబుచ్చుమార్గములు !
తగువినోదము లేవొ తనరుటం జేసి
పగ లెడఁబా టంత బాధింపకున్నఁ
గాలయాపనకు మార్గము లేకయుంట
రేల శోకం బడరించునం చెంతు,
ఆతరుణమున నీ వట కేగి సద్మ
వాతాయనంబున వరలి యున్నదరి
స్థండిలశయన నాసతికి నానుడులఁ
గొండొక సౌఖ్యంబుఁ గూర్చు మో సౌమ్య !
తొలిదెస మొదలునందునఁ గళామాత్ర
విలసితం బగునిశావిభుమూర్తి యనఁగ
సగమయి యాధివశత నొకవైపుఁ
జిగురాకుఁబాన్పునఁ జేర్చినదాని
తొల్లిక్షణముగ నాతో నిష్టరతుల
నుల్లాసముగఁ బుచ్చియున్నరాతిరి నె
నేఁడు వియోగాతినిష్ఠుర దీర్ఘ
వేఁడినిట్టూర్పుల వెడలించుదానిఁ
గనుఁగొని నాదువాక్యంబు లో సౌమ్య !
వినిపింపు వీనులవిందు చేకూర.
జాలమార్గప్రవిష్టంబులు నమృత

జాలశీతలములౌ చంద్రాంశువులకు,
కాంతివిశ్వాసంబుతో నెదు రేగి
వెంటనే యూర్వశి విముఖియై మరలి
వెతచేత నయనారవిందంబు సలిల
యుతపక్ష్మములను గొండొక కప్పుదాని,
అంబుజాపరణాస్యమౌ దివసమున
నంబుజనింబలె నలరారుదానిఁ
గనుఁగొని నాదువాక్యంబు లో సౌమ్య!
వినిపింపు వీనులవిందు చేకూర.

ఒక్కస్నానంబెట్టై మొప్పుట బిరుసు
లెక్కి చెక్కులమీఁద నెగురుముంగురుల
వాతెఱచిగురాకు వాడ్పునిట్టూర్పు
చేత మాటికి నెగఁజిమ్ముదాని,
కలలోననైన నాకలయిక కొంత
కలుగునా యని నిద్రఁ గాంక్షించుదాని
నయనబాష్పముల నానలుసంతయాశ
కయిన మార్గము లేక యల్లాడుదానిఁ
గనుఁగొని నాదువాక్యంబు లో సౌమ్య!
వినిపింపు వీనులవిందు చేకూర.

విరహాదిదినమున విరిదండఁ దీసి
తరుణిచే జడగ బద్ధంబైనయదియు,
శాపాంతమున నార్తి జాఱ నాచేత
నే, పునరుద్వేష్టనీయమౌ నదియు,

చిరకాలసంస్కారసిద్ధి లేకునికిఁ
బరుషంబు విషమమై పరఁగెడునదియు,
తాఁకఁ గుదుళ్ల వేదనఁ గూర్చునట్టి
యేకవేణిఁ గపోల మెడలించుదాని;
కనుఁగొని నాదువాక్యంబు లో సౌమ్య!
వినిపింపు వీనులవిందు చేకూర.

అతిభారమునఁ గొన్ని యరుచిచేఁ గొన్ని
చ్యుతములౌటం గొన్ని సొమ్ములు మాని
తడవకుఁదడవకుఁ దల్పంబుపైనఁ
బడుమృదుగాత్రి మేపగిదినో నిల్పి
జలద! నీచేఁగూడ జలమయాశ్రువుల
నలవలరాల్పు నవ్వామాక్షి నిజము
అరయఁగా నార్ద్రాంతరాత్ము లౌవారు
కరుణాంతరంగులు కారొకో తలఁచు.

ఎఱుఁగుదు జలద! నాయెడ నీదుచెలికిఁ
దఱుఁగనియనురక్తి తనరుట దాన
నిటువంటిదిగఁ దొలియెడఁబాటునందుఁ
గుటిలకుంతల ననుకొందును గాని
యందగాఁడ నటన్న యభిమాన మింత
తొందరించె నటంచుఁ దోఁచునో నీకుఁ
దమ్ముఁడా! నాయన్నదానిలో నిజము
నెమ్మదిపై నింక నీవెఱుంగుదువు:
మూఁగుచుండుటఁజేసి ముంగురు లెపుడు

క్రేఁగంటిచూపులు కెరలనియదియు,
కాటుక యెన్నాళ్లుగనొ మానుకతన
నీటును మేల్ నిగన్నిగ లేనియదియు
విరహాది మధుసేవ వీడుటఁజేసి
మఱి భ్రూవిలాసముల్ మఱచినయదియు,
ఉపకృతి సల్ప నీ వుపకంఠ మేగ
నుపరిభాగస్పంద మొప్పారునదియు
నగునంచు నూహింతు నంబుదా! నాదు
వగలాఁడి నిడువాలువామలోచనము.

అలఘుమత్పాణిరుహాక్షతంబులకుఁ
బలుదినంబులనుండి పాత్రంబు కామి,
చిరపరిచితమయి చెలఁగుముత్యాల
సరమును దైవవశంబుచే వీడి
సురతాంతమందు మెచ్చులకు నాచేతఁ
జరణసంవాహనసత్కార మంది
సరసరంభాస్తంభసదృశమై యొప్పు
తరుణివామోరువు తారళ్య మందు.

జలద! నీ వట కేగుసరికి మత్కాంత
కలఁతచేఁ గూరుకే కన; దొక్కవేళ
నిద్దురలో నున్న నీవు జాగనక
సద్దుసేయక యొక్కజా మోర్వవలయు;
ఎట్టులో చిరకాల మేగఁగా నిపుడు
కట్ట! కలం గాంచఁగల్గితి నంచు

నన్ను గాఢాలింగనముల బంధించు
విన్న నీశబ్దంబు విఘ్న మా నేమొ.
ఆతనుమధ్యఁ ద్వదాయాతశీత
వాతపోతముల నావల మేలుకొలిపి
మాలతీజాలకమహితలావణ్య
శ్రీలతోఁబాటు నుజ్జీవితఁ జేసి
ఎవఁ డితఁడని త్వత్సహితగవాక్షంబు
నవహితయై చూచు నకలంకచరిత
మిఱుమిట్లుగొలుపక మెఱపులచేత
నుఱుముమాటల నిట్టు లువిదతో ననుము.
ఓసుమంగలి! నీప్రియున కిష్టసఖుఁడ
వాసిమై నన్నంబువాహుం డటందురి
తెలియుమా భర్తృసందేశ మిత్తఱిని
నలినాక్షి! కొనివచ్చినాఁడ నీ కనుచు,
ప్రాణమెత్తుగ మదిఁ బాయనిప్రియుల
వేణిమోక్షముల కువ్విళ్ళూరుకొనుచు
దారిలో వెతల నెంతయుఁ గుందు బాట
సారులమంద్రసుశ్రావ్యఘోషముల,
పోరుగూరులను వీడి పొం డిండ్ల కనుచుఁ
దరుణిరో! మఱియుఁ దొందరపెట్టువాఁడ.
అనిపల్క మత్ప్రియ యంజనాపుత్త్రి
జనకజపోలె నుచ్ఛ్వసితచిత్తమునఁ
గనుఁగొని సత్క్రియాకాండంబుఁ దీర్చి

విను శ్రద్ధ నావలివృత్తాంత మెల్ల,
అంగనలకుఁ బ్రియోదంతమ్ము కాంత
సంగమమ్మునకు నీమన్న్యూన మండ్రు.

ఓరమ్యశీల! పరోపకారైక
పారీణజీవనా! ప్రార్థింతుఁ బద్మ
నేత్రితో నిట్లను నీచెలికాఁడు
చిత్రకూటాశ్రమసీమ నున్నాఁడు
నీవియోగంబుచే నెగులుచున్నాఁడు
జీవ మెట్లో దాలిచియె యున్నవాఁడు
ఉబుకుపెన్వెత నెట్టు లుంటివో యనుచు
అబల! నీసేమంబు నడుగుచున్నాఁడు
భామినీ! సులభవిపత్తుల మొదల
సేమమేగద పృచ్ఛసేయంగవలయు?
దూరవర్తియుఁ దనగు దైవహాతక
వారితగతియునై వనిత! నీప్రియుఁడు
అతికృశీభూతంబు నతిగాఢతప్త
మతిసముత్కంఠంబు నశ్రుద్రితంబు
సవిశేషదీర్ఘనిశ్వాసభరంబు
నవ్రుతనమేనితో నట్టినీమేను
సంకల్పశతసహస్రములతో నెపుడుఁ
బంకజముఖి! పరిష్వంగ మొనర్చు.

చెలులముందట నీదుచెక్కుల నంట
వలనుగాక రహస్యవైఖరి నెవఁడు

అందఱు వినఁదగునదియ, కర్ణంబు
నందుఁ జెప్పఁగ లోలుఁడయ్యె, నాతండు
గఱ్ఱయైన నినుఁ బాయఁగాలేనివాఁడు
కడుదూరదేశానఁ గడగండ్లఁ బడుచు
వెడవెడమాటల విరచించి యెవియొ
పడఁతి! నాముఖముగాఁ బల్కుచున్నాఁడు.
నీదేహరుచి ఫలినిలతలందు
నీదుచూపులు హరిణీజాలమందు
నీరమణీయాస్యనిర్మలకాంతి
శారదపూర్ణిమాశశిబింబమందు
ఆశాసనీయమై యలరునీకేశ
పాశంబు నా బర్హిబర్హభారముల,
తావకీనభ్రూలతావిభ్రమములు
శైవలిన్యల్పోర్మిసముదయమందు,
ఊహింతు నేకాని యోచండి! నీకు
నాహా! యెటఁ సామ్య మలర దించుకయు.
అణుమధ్య! ధాతురాగాదుల నిన్నుఁ
బ్రణయకోపినిఁగ రాపలకపై వ్రాసి
అతివరో! నన్ను నీయంఘ్రిసరోజ
పతితునిగా లిఖింపఁగ నెంచునంత
మాటిమాటికిఁ బొంగి మఱి వచ్చుకంటి
నీటిచే దృష్టి కన్పింప దించుకయుఁ,
గ్రూరదైవం బిందుఁ గూడ నేమందు
నోరువఁడాయె నయ్యో! మనపొందు.

కల నెప్పుడో యతికష్టంబుమీఁదఁ
గలసిననినుఁ బిగికౌఁగిటఁ జేర్ప
నిదురలోనన యట నీ వుండినట్లు
ముదిత ! నీపై భుజమ్ములఁ జాఁచునన్ను
వనదేవతలు చూచి వనటఁ జివుళ్ళఁ
గనునీరు ముత్యాలకరణి రాల్పుదురు.

సల్లలితశ్రీలఁ జనుదేవదారు
పల్లవపుటములపై దాడివెడలి
ఆక్షీరములచేత నతిఘుమాయించి
దక్షిణదిక్కుగాఁ దరలినమంచుఁ
గొండతెమ్మెరలు నిన్ గుణవతి ! యంటి
యుండనోపు నటన్న యూహచే నిందు
నీగుణాంశమైన నెగడునో యంచుఁ
కౌఁగిలించెద వానిఁ గమలాయతాక్షి !

నీటిధారలను నానినభూమితోడి
పాటు వాసించుతావకముఖంబునకుఁ
కాలదూరున్ గృశున్ జాలియే లేక
బాల ! యేఁచఁగసాఁగెఁ బంచబాణుండు;

అంబరచుంబదభ్రాదభ్రవృష్టి
జంబాలజటిలమై జగ మొప్పువేళ
రవికిరణములె పాఱనిజడినాళ్ళు
పువుఁబోఁడి ! యెటు వెళ్ళిపోవునో రేపు.

అతియామమయౌ యాత్రియామ యేరీతి
గతయామమ్మై క్షణకాలమ్మై పోవు?
అవు నట్లె యెల్లు సర్వావస్థలందుఁ
బవలును మందాతపమ్ముగా ననుచు
నేవేళఁ దీరనియిట్టికోరికల
నీవియోగార్తిచే నెగులు నామనము.
కలిక! నేశాపాంతకాలచర్యలను
దలపోసికొని జీవితము నిల్పుకొందు
నిలుపుకొ మ్మట్లులే నీవుఁ గల్యాణి!
కలఁతఁజెందకుము నాకష్ట మాలించి
యెల్లకాలము సౌఖ్య మెవ్వాఁడు చెందు
నెల్లకాలము దుఃఖ మెవ్వాఁడు పొందు
సక్రమాత్యుచ్చనీచైర్గతి గల్గి
చక్రరేఖనాఁ జను భాగ్యరేఖ.
శాపాంత మగు నాకు జలజాయతాక్షి!
పాఁపసెజ్జను శార్ఙ్గపాణి లేచుడును
కోమలీ! కనుమూసికొని కష్టమనక
యీమాసములు నాల్గు నెటొ వెళ్లఁబుచ్చు,
అటుమీఁదటను మన మనుభవించెదము
కుటిలకుంతల! నేఁటికోరిక లెల్ల
సారభాసురచంద్రచంద్రికాపూర
చారుతరంబులౌ శారదనిశల.
తిరిగియు నను సుదతీ! తొల్లి శయ్యఁ
గరముల నామెడఁ గౌఁగిటఁ జేర్చి

నిదురించి పెద్దగ నీ వేడ్చుకొంచుఁ
ఒదఁపడి మేల్కొన, 'భామ ! శోకింతు
విది యేమి' యనిపల్క నెన్నియోమార్లు
సదరహాసంబుగాఁ జాన ! నీ వనవె
'కాంత ! యెంతటిమోసగాఁడ వీ వన్య
కాంతతో నున్నట్లు కలఁగంటి' నంచు.

జలజాక్షి ! యీయభిజ్ఞానదానమునఁ
దలపోసి కుశలవర్తనునిగా నన్ను
గిట్టక మన కాత్మఁ గీడెంచువారు
పుట్టించునపవాదముల నమ్మఁబోకు
ఎడఁబాటునందు నో యింతి ! స్నేహములు
చెడు నను నుడి, విశ్వసింపఁగాఁ జాల
లేమ ! భోగం బసల్ లేమిచే నపుడు
మామూలుకన్నఁ బ్రేమలు పెచ్చుపెరుఁగు.

తొలియెడఁబాటు దుఃఖాతిరేక
కలిత నీసఖి నిట్లుగా నూఱడించి
వెనువెంటఁ ద్రినయనవృషసముత్ఖాత
ఘనచారుశృంగమౌ కైలాస మెడలి
ప్రియతమాప్రహితసాభిజ్ఞానకుశల
మయవచనముల నామదిఁ గొంకు మాన్పి
ప్రొద్దుటిమల్లెపూపోల్కి దుర్బలత
దద్దయు నాజీవితమ్ము రక్షింపు.

సత్యంబుగా మది సౌమ్య ! యీబంధు
కృత్యం బొనర్ప నంగీకరించితివె ?
బదులు చెప్పమి నన్యభావన లేదు
కుదురు నీగాంభీర్యగుణమున కద్ది
అద్దిరా ! యిచ్చెద వడిగినయాత
సద్దుసేయక నీరు చాతకంబులకుఁ
బ్రత్యుత్తరంబన్నఁ బ్రణయులపట్ల
నత్యుత్తముల కీప్సితాచరణంబె.

నాపైని నేస్తంబుననో మందయానఁ
బాప మీతం డెడఁబాసినాఁ డనియో,
కనికరంబుననో, యిక్కార్యంబు నీకు
ననుచితకృత్యమే యగుఁగాక తీర్చి
తరలు ప్రావృట్సంభృతశ్రీలు గ్రాలఁ
దరువాత నీయీప్సితస్థానములకు ;
గడవైన లేకుండుఁగాత నీకిట్లు
లెడఁబాటు నీమెరుపుటిల్లాలితోడ.

—♦ గద్యము ♦—

ఇది శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యప్రణీతంబగు
ద్విపద మేఘదూతంబున
ద్వితీయాశ్వాసము.

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.